# పద్యకథలు.

(మూఁడవ తరగతికి)

గ్రంథకర్త:
ఉభయభాషాప్రవీణ
జంపాల వేంకటనృసింహము చేత
తెలుఁగు పండితులు, బోర్డుహైస్కూలు, దగ్గిర



ప్రకాశకులు
రాధాకృష్ణ అండు కంపెనీ,
ఎడ్యుకేషనల్ పబ్లిషర్సు, బెజవాడ.

# పద్యకథలు.



## (మూఁడవ తరగతికి)

గ్రంథకర్త:
ఉభయభాషాప్రవీణ
జంపాల వేంకటనృసింహము చౌదరి
తెలుఁగు పండితులు, బోర్డుహైస్కూలు, దుగ్గిరాల.



ప్రకాశకులు
రాధాకృష్ణ అండు కంపెనీ,
ఎడ్యుకేషనల్ పబ్లిషర్సు, బెజవాడ.
1934.

సర్వస్వామ్యములు ప్రకాశకులవి.

వెల రు 0—2—(

# పీఠిక.



నీతులను పద్యములలోఁ జెప్పినచో నవి చదువ[redacted] రమ్యముగా నుండుటయేగాక యా నీతిపద్యములును, వానిద్వారా నేర్చుకొనిన నీతులును జీవితాంతము వఱకును జ్ఞప్తియందుండును. అందుచేఁ బద్యకథలను ప్రాథమిక పాఠశాలలలోని పై తరగతుల బాలురకొఱకు బ్రచురింపనెంచితిని. ఆయా తరగతుల బాలుర మానసికాభివృద్ధినిబట్టి యీ పద్యకథల యందలి భావములు, శైలి క్రమముగాఁ గ్రింది తరగతి పద్యవాచకములో కంటె పై తరగతి వాచకములో హెచ్చుచుండును. విద్యాశాఖాధికారులును, ఇతరులును ఈ గ్రంథ ప్రచురణమునకుఁ దోడ్పడుదురు గాక!

దుగ్గిరాల,
27—12—1934.

విధేయుఁడు,
జంపాల వేంకటనృసింహము.

# పద్యకథలు.



## పిల్లులు : కోతి.



సీ॥ రెండుపిల్లులు రొట్టెయొక్కండు తెచ్చి
రెండుగాఁజీల్చి "పెద్దగానుండు ముక్క
ఏను భక్షింతు నేనె భక్షింతుననుచు
పోరి పోరి తుదకు తమ పోరుతెగక

గీ॥ కోతిఁగన్గొని "యయ్యా! మాఁకుగల పోరు
తీరునట్టులీ ముక్కలం దెలివితోడ

సమముగాఁజేసి నంచుఁడు సంతసింతు''
మనుటయు నటులె చేయుఁడునంచుఁజెప్ప 2

గీ॥ త్రాసుతెచ్చి యాముక్కలా త్రాసునందు
రెండు ప్రక్కలయందును రెండునుంచి
పెద్దముక్క హెచ్చని కడుఁ బెద్దముక్క
దానినుండి కొఱికితినెఁ దానె యద్ది 3

గీ॥ అట్లు పెద్దముక్క కొఱుక నదియ చిన్న
ముక్కయయ్యె నదికని "యీముక్క చిన్న"
దంచు తననోటిలో నుంచుటరసి యంతఁ
బిల్లులు మనమునందురపిల్లి యనియె 4

గీ॥ "ఆర్య! మేమె పంచుకొనుట కాత్మనెంచి
తిమిఁక మీరు శ్రమనడక తెండు ముక్క
లవ్విగెకొని సమముగునట్లుచేసి
తిందు''మనుటయుఁ గోతి యాతెలుఁగునెఱిఁగి 5

గీ॥ చాలుఁ! జాలు! మీబుద్ధుల సరణితెలిసె
పెద్దఁజేసి నాతలపయిఁబెట్టినట్టి
పనిని పూర్తిసేయకమున్నె బాధపెట్టి
వలదటంచును జెప్పుట బాగుకాదు.'' 6

సీ॥ అనుచు నందొక్క ముక్కనుదినిరొ నంత
అయయో! మిగిలిన యాముక్కనైన నిందు
మేమిరువురమును భుజించి మీకు మ్రొక్కి
వెడలుదుమనుటయుంగోతి బిట్టునలిగి 7

సీ॥ మీకు నిరువురకును గడుఁ మేలెఱింగి
పోరుతీర్చితింగాన నీముక్క నేను
తినఁగఁ దగదొకో! యనుచును దినిరొనంత
తుదకు మిగిలిన ముక్కయుఁ వదలకుండ 8

సీ॥ పిల్లులదిగాంచి కడుదుర పిల్లి యకట!
భయముచే నొకమాటయుం బైకిననక
ఏడ్చుచుంబోయె కఁ ముఁగృశించి; యట్ల
యగునుగాదె తగవులాడునట్టి ప్రజకు? 9

సీ॥ భాగముల్ తెగక వివాదపడుచుఁ గోర్టు
లెక్కెడి జనుల కెందు లాభింపఁబోదు
హెచ్చో! తగ్గో! రాజీని కావించుకొనెడు
నరుడు సుఖమందు; నతని ధనమ్ము హెచ్చు. 10



# నక్క : కొంగ.



సీ॥ నక్కయొక్కటి కొంగను "నాగృహమున
భోజనముసేయ రండని" బుజ్జగించి
పిలువఁ గొంగయు నెంతేనిఁ బ్రేమతోడ
దనను బిలిచెనటంచు సంతసమునెంది 1

సీ॥ "ఆర్య! వత్తు"నని తన గృహమ్మునందు
విందుసలుపు వేళవఱకు వేచియుండి
నక్క యింటికిఁజనె భోజనముసలుపమి
నాకలిగొనుచు త్వరమెయినారగింప 2

గీ॥ ఇంటిదరికి కేగునపుడ యావంటకముల
కమ్మవాసనల్ నల్లడఁ గ్రమ్మి కొంగ
కాకలి పెరిగి నోరూరె నంత నక్క
వచ్చి కొంగకుఁ గావించె స్వాగతమ్ము 3

గీ॥ కొంగకుఁ బరాభవమ్ము సేయంగ నెంచి
నక్క వెడలుపుగల పాత్రయొక్కటికొని
యందు నన్నంబువడ్డించి హాయిగాఁగ
తినుమటంచు మర్యాదగా ననుచునుండె 4

గీ॥ కాని తనకు తినఁగవీలుకాని పాత్ర
యగుట ముక్కుతోఁ బొడువఁగా నన్నమవలి
కివలి కరుగ భోజనము కావింపకుండె
కొంగ; తృప్తిపడుచు నక్క కుడుచుచుండె 5

గీ॥ వీలగు మఱొక్క పాత్రలో విందుగుడిపి
పంపఁదలఁపక గడుఁదలవంపుగాఁగ
"కడుపునిండెనా?" యనుచుఁ నక్క వచియింప
మాఱుపల్కక యింటికి మఱలెఁ గొంగ 6



గీ॥ కొన్ని దినముల తరువాతఁ గొంగ నక్క
యింటి కరిగి "మాయింటికి నేగుదెంచి
భోజనముసేయ రండ''ని ముచ్చటగను
బిలువ సంతసమ్ముఁ గనుచు వెడలె నదియు 7

గీ॥ మూతి యిరుకైన పాత్రలో భోజనమ్ము
పెట్టి "బావగారు! తినుఁడు! ప్రీతితోడ"
ననియెఁ గొంగ; కమ్మనితావి కలరిపాత్ర
కడకుఁ బోయి భుజింపఁగా గడగెనక్క. 8

గీ॥ మూతికడనున్న కొంచెము ముట్టెఁగాని
తక్కినది పాత్రయడుగునఁ దనరుచుంట

కుడువవీలు కన్పడకున్న గుందఁజొచ్చె
రుచులు పెనగొని నోటనీరు గురియంగ. 9

గీ॥ కుడువఁగాలేక దగ్గరఁగూరుచుండి
నక్క యాకలిబాధచే నవయుచుండ
బావగారు! తినుడనుచు భక్తినభిన
యింపఁదొడఁగెఁ గొంగనిజము నెఱిఁగితాను

గీ॥ కొంగ యభినయమది నక్కకుం దెలిసియు
మాఱుపల్కక దూషింప మనసురాక
పైకిఁగన్పడ నీకలోపలనదెల్లఁ
దనదు మోసపుఫలమని తలచియేడ్చె. 10

గీ॥ ఒరుల కపకార ములుసేయు నరులుతాము
ఎన్నిరెట్లో బాధలనుభవింతురు తుదకు
కొంగకుఁ బరాభవము సేసికొలది దినము
లందె నక్కకు పరాభవమందలేదె? 11



# తోఁడేలు : మేకపిల్ల.



క॥ ఒక్కనాఁడొక్క తోఁడేల దొక్కచోట
నేటిలో నీరుత్రావుచు నీటిదిగువఁ
జేరి దాహమ్ము తీరఁగా నీరుత్రావు
మేకపిల్లనుజూచి యిమ్మెయిని బల్కె 1

గీ॥ "అకట! నానీరు ముఱికియౌనట్లు సేయు
దేల? నీకింతపొగరా నె? యిట్లురమ్ము
నీకుఁదగిన శిక్షసలిపి నీమదమ్ము
ణఁతు" ననుటయు నాపిల్ల యదరి వడుచు 2

గీ॥ మేనువణకంగ వినయమ్ము మెయినిబల్కె
"అర్య! నీటికిదిగువ నేననంగియుంటి
నెట్లు నానీరు నీకడకేగుఁజెపుమ?—
నీకుఁ గీడుసేయఁగ లేదు నిజము చూవె!" 3

గీ॥ అనినఁ దోడేలు తనయసత్యమ్ము నెఱిగి
ఏల తిట్టితివితరుల యెదుటనన్ను
ఆరుమాసము లకుఁబూర్వ?" మనిన "నేను
జననమందితి మూడుమాసముల నాఁడె". 4

గీ॥ అనియె మేకపిల్ల "మఱచియుంటి! నీదు
"తండ్రినను దిట్టె యావనితప్పుకాదె?
అనుచుఁ దోడేలు వడివడినజముఁ జేరి
తండ్రితప్పించి నినుజంపఁ దలతు"ననిన 5

గీ॥ "తండ్రి తిట్టఁగా లేదబద్ధంబు నెవఁడో
చెప్పె; నాతని పేరును జెప్పు"మనిన
"నన్నునిట్టి ప్రశ్నములు పొనర్పనగునె?
ఇంత తర్కమా? నీ"కని యెగిరెఁబైకి. 6

గీ॥ తండ్రితప్పునకయి ననుదండనమ్ము
సేయఁదగునె?'' యటంచు వచింపఁ "జాలు!
కట్టిపెట్టు మిథ్యర్థముల్ కఱకుమోపి
ఇచ్చవచ్చినట్టులు వచియింపనగునె? 7

గీ॥ తండ్రిసేయు ఋణమ్ములు తనయుఁడెట్లు
తీర్చునోయట్లు తననోరు తీటగాగ
తండ్రి తిట్టిన తిట్లకు దండనంబు
నీవపొంద వలయునంచు నిర్ణయింతు 9

గీ॥ అనుచుఁదోఁడేలు నాపిల్లనదిమిపట్టి
గోళ్లతోఁ జీరి చేతితోఁగొట్టి చంపె
దుష్టులగువారు శిష్టులతోడఁ దగవు
నెట్లో కల్పించుకొనుచు హింసింత్రుకాదె? 10



# నక్క : ద్రాక్షపండ్లు



గీ॥ నక్కయొక్కఁ డాకలిచేత నవయుచుండి
ద్రాక్షగెలలను జూచి సంతసముతోడ
నెగిరి పట్టుకొనఁగఁ బ్రయత్నించి యందు
కొనఁగఁజాలక లతకేడఁగూడుచుండె. 1

గీ॥ కూరుచుండి యత్నముఁ జేకూరుననుచు
నాసచెంది మరల గెలలందఁగోరి

హెచ్చుయత్నముతో తెచ్చి యెగురువేళఁ
చిలుక యొకటి ద్రాక్షకడకుఁజేరి చూచె. 2

గీ॥ నక్క బావ! యెగిరెదేల? యెక్కి యిచ్చు
వచ్చినన్ని పండ్లుతిని పోవంగరాదె?
ఏల యిట్లు ఫలములేక యెగురుచుందు
వందనిఫలమ్ముఁ గోరుట హాస్యముకద? 3

గీ॥ అనిన "ఛీ! పుల్లనిఫలమ్ము లందఁగోరు
దునొకో! పుల్లనివని కాలితోడఁ దన్ను
చుంటిఁ! బుల్లని ద్రాక్షల నొల్లనే" న
టంచు గంభీరముగ బల్కె నాలకించి 4

గీ॥ చిలుకయనియెను 'బావ! రుచిగల ఫలము
లివి యొసంగెదఁ బ్రేమతో నెట్లొతినుమా
పూర్వ మెన్నుడీపండ్లను పుల్లనక
తిందు విపుడేల యిటులల్గితివొకో! చెపుము!' 5

గీ॥ అనుచు నాలుగుపండ్లనీయంగఁగుడిచి
ఎంతయుందినుకోరిక హెచ్చ నోపఁ
జాలక చిలుక నడిగినఁ జాలపండ్ల
నిచ్చునను చు నక్క తలంచి యిట్లనియె 6

గీ॥ 'మంచిమాటల నెంతో లాలించినన్ను
గారవించుటఁ గోరిక కల్గెమదిని
నాకఁగెల విడువు బాగుగానుండు నేని
కుడుతు లేకున్న నావలవిడుతు సుమ్ము'' 7

గీ॥ అనినఁ జిలుక నవ్వుచు జెప్పె నయయో! నేఁడు
చిలుకలకుఁ బండువౌటచేఁ జిలుకలెల్ల
నిదిగో! వచ్చుచున్నవి చూడుు! మీఫలమ్ము
లన్నియును జాలవెట్టిత్తు నకటనీకు! 8

గీ॥ అనిన నక్క హాస్యముకొఱకంటిఁగాక
పుల్లనివని తన్నినసండ్లు ముట్టుటెట్లు?
పోయివచ్చెదననుచును మోమునందుఁ
జింత కన్పట్టు నెచటికో చేరెనంత 9

గీ॥ అందరాని వస్తువులు నింద్యమ్ములనుచు
గొందఱీసడించుచుఁ బలుకుదురుకాని
దఱికివచ్చుచో మ్రింగఁగానరయుచుంద్రు
నక్క ద్రాక్షలం దిననెంచిన విధముగను 10

# రామకోటయ్య : చుట్టలు, సిగరెట్లు.



గీ॥ బాలుఁడొక్కఁడు గుణియాచుఁ గ్రాలువాఁడు
రామకోటయ్య బెజవాడ గ్రామవాసి
చెడ్డబాలురతోఁ జేరి చెలిమి చేసి
చుట్ట త్రాగఁ గడఁగె నొరుల్ చూడకుండ 1

గీ॥ అంతఁ దెలిసి తండ్రియడుగ నతడు బొంకెఁ
జుట్టత్రాగెడు వేళఁ బొంచుకొనియుండి
పట్టుకొని యసత్యమ్మును బయలుపెట్టి
రెండు తప్పులతనికి వర్ణించి చూపి 2

గీ॥ చుట్టలందాగవలదని గట్టిగాఁగఁ
జెప్పియవల గురువుతోడఁ జెప్పెఁగాని
మానఁడాయెను బాలుండు పూనియెంతొ
కాలమునుండి నేర్చిన కతనఁ దాను. 3

గీ॥ గురుఁడు నికొటైను విషము నీగుండెలందుఁ
జేరి చచ్చెదవంచును జెప్పెఁగాని

చాటునంగాల్చుచుండె విషమునుజెఱిగి
యొప్పుకొనియుఁ జుట్టలుగాల్చు టుడుగఁడాయె 4

గీ॥ యౌవనమ్మది వచ్చిన యవలతెచ్చి
కాలువంబూనె నెప్డొ బీడీలును సిగ
రెట్టు లతఁడు కాలుచు సిగరెట్లవలన
ధనము ఖర్చాయె నండె బీదతనమును. 5

సీ॥ మూఁడణాల కొక్కటిగాఁగ మూఁడువాల్గు
పెట్టెలు సిగరెట్లు దినముఁబీల్చి తండ్రి
ఇచ్చిన ధనము తరుగఁగా నెగ్గుగొనక
చుట్టలకు మళ్లె సిగరెట్ల పోకు మాని. 6

సీ॥ నోరుకంపెత్తె జనములెవ్వారు దఱికి
చేరక దఱికిఁ దానేఁగ దూరమేగు
చుంట కన్గొనిదుఃఖంబు నొందుచుండు
నైన చుట్టలు మానఁగా నరయుఁడయ్యె. 7

గీ॥ ఇట్లు ధనముపోవ వెతల నెన్నియేనిఁ
గుడిచి తినఁగూడు కట్టఁగా గుడ్డలేక

ఒక్కదినము హఠాత్తుగా నొక్కరోడ్డు
వయిని బడివిడిచె నకట! ప్రాణములను 8

గీ॥ తీసికొన్నను ఆత్మలల్ తీసికొనఁగఁ
జాలు దేహముకల్గిన జనుఁడతండు
ఏలయింత త్వరగమరణించెనంచు
శవముకోసి పరీక్షను సలుపుటయును 9

గీ॥ గుండెల నికొటైనువిషము కూడుకొనియె
నది పొగాకు త్రావఁగ జేరెనంచు నతని
శవముఁగోసిన డాక్టరు సత్యమెఱిఁగి
తెలుపఁ జుట్టలోఁగల కీడు తెలిసె జనము. 10



# ముట్టిన దెల్ల బంగారమగుట!.

## (i)



గీ॥ స్వర్ణపరుఁడను రాజు పాంచాల భూమి
నేలుచుండెఁ బ్రజలకెంతయేని సుఖము
గలుగ; నతఁడొక దినమున దలఁచెనాత్మ
"నెవరికిని లేని మహిమ గడింతు"ననుచు. 1

సీ॥ అనుచుఁ దలపోసి తలపోసి తనకు స్వర్ణ
మందుఁగాంక్ష హెచ్చగుటచే నతఁడుతాను
తాకినదియెల్ల పసిడిగాఁ దక్షణంబ
మాఱునటు వరమందఁగా మదిఁదలంచి 2

సీ॥ రాజ్యభారమ్ము మంత్రిపరమ్ము చేసి
ఒక్కవర్షమ్ము రేఁబవ లుగ్రతపము
సలిపి యీశుండు దక్షినిల్వఁ గొలిచితాను
ముట్టినది స్వర్ణమగు వరమునడుగంగ 3

సీ॥ "రాజ! నీకెంతో బంగారు రాశిగలదు
ఇంక బంగారు నేలయద్ధింతు చెపుము
వేఱువరమిత్తు కోరుమీ వెఱ్ఱిమాను"
మనిన నొండువరము నొల్లననియె రాజు. 4

సీ॥ "ముందెఱుంగమి నీరీతి బుద్ధిపుట్టెఁ
గానిదానితో సౌఖ్యమ్ము కాంచవీవు
అయిన నిత్తును గొమ్ము"ని యరిగెనీశుఁ
డంత స్వర్ణపరుఁడును గృహమ్ము చేరె" 5

గీ॥ రాజువచ్చెనటంచును బ్రజలు సంత
సమున మూఁగి స్వాగతములు సలిపి; రెన్ని
యేనలంకృతులను బురమెల్లఁ బండు
వోయనఁగఁ జేసిరెల్లరు నొక్కరీతి ౬

గీ॥ మంత్రులకుఁ బెద్దలకు దనమహిమఁదెలియఁ
దోటలోనికి గొంపోయి తోఁచినట్టు
లెల్లచెట్లనంటుకొనుచు హేమవృక్ష
ముల నొనర్చి చూపెఁ బ్రజలబ్బురమునొంద 7

గీ॥ రాజు ముట్టువస్తువు హేమరాశియగుచు
వఱలునను వార్త పురము నల్వంకలందు
వ్యాప్తినందఁగ నతని భాగ్యంబుఁ దలఁచి
మెఱియఁ జొచ్చి రాపురిఁగల నరులు కరము 8

గీ॥ అంత మధ్యాహ్నమగుటయు సభ్యజనులు
నింటికేగిరి రాజును నింటికేగి
స్నాన మొనరింపఁబోవఁగ జలమువెల్ల
పసిఁడియగుటచే మదిఁగడు విసువుఁగొనెను. 9

గీ॥ పదియు రెండేండ్ల కూతురు ప్రణయమొవ్వ
వచ్చి నేర్పుమై దండ్రికి వడ్డనమ్ము
సేసె షడ్రుచుల్ ప్రబలి రుచించునట్టి
భోజనమ్మును తేనికింపుకొలువంగ 10

గీ॥ కమ్మవాసన నల్గడల్ గ్రమ్ముచున్న
పిండివంటల నాకలి పెచ్చుపెరిగి
కడుపుఁ గొల్వఁగా నాతండు కడకుఁ జేరి
ముద్దయెత్తఁగ స్వర్ణమై పోయెనద్ది. 11

గీ॥ మంచినీరెత్తఁ ద్రావంగ మనసుగలిగి
యద్ది యపుడవసిడి నీరమగుటఁజూచి
ఆకలియు దప్పితీరక "హా! చెడితి" న
టంచు గూఁతుగౌగిటఁజేర్చి యఱచె నంత 12

గీ॥ కూతురుబసిండి బొమ్మయగుటయుఁ నృపతి
యేడ్వనెల్లరు వచ్చి "యిదేమి?" యనినఁ
గర్మఫలమని చింతించెఁ గ్రమ్ముకొనిన
వారలెల్లరుఁ గరము విచారమంద. 13

# పుట్టిన దెల్ల బంగారమగుట!

## (ii)



గీ॥ కూతురు పసిఁడిబొమ్మయై కూలుటయును
దినఁగ భోజనమ్మది లేమి; తీర్చుకొనఁగ
వీలులేక దాహము నాల్క విఱుచుచుంట
దలఁచి తలఁచి రాజేడ్చెఁ జిత్తమ్ము విఱుగ 1

గీ॥ ఈశుడు మునుపు చెప్పిన హితము మదికి
జ్ఞాపకము వచ్చుటయు తనజ్ఞానహీన
త మదిఁగోపరింపఁగ నీశుఁదలఁచి పెక్కు
గతులఁ బ్రార్థించి యాతని క్షమను గోరె. 2

గీ॥ కండ్లనీరులు ధారలుగాఁగ నేడ్చు
చుండు వార్తఁ దెలిసికొని యూరిప్రజలు
"సర్వముం గలతేనికి జ్ఞానమొకఁడు
కొఱఁత యగుటచే దినుటకుఁ గూడువోయె 3

గీ॥ గంజినీరు త్రాగి సుఖముగాఁగ మనము
సౌఖ్యమందఁ గోట్లకొలఁది స్వర్ణమున్న

రాజు కుడువ భోజనమును ద్రావ నీరు
లేక చచ్చుచుండె"నని పలికిరి వగచి 4

సీ॥ స్వర్ణనరుడును మనము నీశ్వరునియందుఁ
జేర్చి భూమిపైఁబడిపార్లి చేరిరక్ష
సేయవేయని భగవంతుఁ జీరి వేడె
ఆకలియుడప్పి ప్రాణమ్ము లపహరింప 5

గీ॥ ఊపిరికృశించి చావు రానుండువేళ
దయతలంచి యీశ్వరుఁడు ప్రత్యక్షమాయె
స్వర్ణనరుఁడు కన్నీళ్ల నీశ్వరునిపదము
లంగడిగి కడుభక్తి చెలంగననియె. 6

గీ॥ బుద్ధివచ్చె నీశ్వర! తాము ముద్దుగాఁగ
చెప్పినహితవు వినక నశించుచుంటి
నింకఁ గరుణింపకున్న జీవింపఁజాల
భక్తుఁడను దప్పుక్షమియించి బ్రదుకనిమ్ము. 7

గీ॥ అనిన వరమిత్తుఁగోరుమటన్న నతడు
"నన్ను దాకువస్తువులు స్వర్ణమ్ముగాగ
మాఱు"నని యొడి వరమును మఱలుపుఁడని
కోర "నట్లయాఁగా"కనెఁ గూర్తిశివుఁడు. 8

గీ॥ మున్ను తన్నంటి స్వర్ణమైపోయినట్టి
యెల్లవస్తువులు తొలుతనెట్టులుండె
నట్లు కావింపుఁడన "నట్లె"యనియె నీశుఁ
డంతలోనవి యెల్లమార్పంది తోఁచె. 9

గీ॥ "బుద్ధికల్గె"యనుచునీశుఁ బూజసేసి
సెలవుగైకొని స్నానమ్ముసేసి పుత్రి
ప్రీతినొసఁగినది కుడిచి పేరుగలుగ
మంచిగా భూమి నేలుచు మనియె రాజు. 10



## సింహము : కుందేలు.



గీ॥ ఒక్కయడవిలో నుగ్రమౌనొక్క సింగ
ము వసియించి మృగములఁ జంపుచుఁ గడుఁ జెల

రేఁగదాని తీవ్రతను భరింపలేక
సర్వమృగములు నొకచోట సభనుజలిపి 1

సీ॥ దినమునకొక మృగమ్మును దినెదునట్లు
సింగమునుగోరఁ దీరువుచేసి యెల్ల
మృగములును సింహముకడకు నేగి తమదు
కోర్కి తెలువనట్లయని యొఁగూర్చినదియు 2

సీ॥ మృగములును వంతులను నిర్ణయించుకొని ది
నమ్మున కొకమృగము బంవన్యాయరీతి
నచ్చు జంతువుఁదిని తృప్తివలల నడవి
నేలుచుండె మృగమ్ముల కేలికయయి 3

సీ॥ అంతనొకనాడు శశెముతావంతురాఁగ
నెట్టులేని మృత్యువును దప్పించుకొనఁగ
నెంచి యొకయుపాయము చింతించి పెద్ద
తడవు సేసి సింహమ్మును దరిసెనవల 4

సీ॥ అమ్మృగాధిపుఁ డెంతయే నదిరిపడుచు
నేల పొద్దుతిరిగిన యిప్పట్లువచ్చి
తీవు? భయము లేదె?యని గద్దించిపల్క
ఎంతయో వినయమునటించి యనియె 5

గీ॥ మీరు రాజౌటయెఱుఁగనే? మీదునాజ్ఞ
మీరి మఱియొకసింగమ్ము చేరెనడవి
దాని తప్పించుకొని రాఁగఁదడవుసేయ
వలసివచ్చెను క్షమియింప వలయుదేవ!

గీ॥ వేఱురాజే యడవియందు వెలసెనొక్కొ?
చూపుమతని జంపెదనటంచు శశము వెను
వెంటనడువగా నొక్క బావికడఁ జేర్చి
అమ్మృగపతి యిందువసించునని యనె నదియు

గీ॥ బావిలోఁ దొంగిచూడఁగాఁ బ్రతిఫలించు
తనదు రూపు వేఱొక సింగమనుచుఁ దలఁచి
ఏమగలుగఁగా నీవు రాజెట్టు లగుదు
వనుచు నూతిలో దుమికి సింహముచచ్చె

గీ॥ ఎల్లజంతువులునుస్తుతియించెశశము
ప్రాణములును నిలిచె నెట్టి బాధలేక
యడవిలోఁగల జంతువుల్ హాయిఁజెందె
చిన్న కుందేటి తెలివిచేఁ జిత్రముగను.

సంపూర్ణము.



